"ప్రజాకవి"

# యోగి వేమన కవితా ప్రశస్తి

## [పద్య, గేయ, వచన రచనలు]


సంకలనం :

"ప్రజాకవి" డాక్టర్ : మల్లిబాబు

(గేయ కవితా విశారద - సాహిత్య విశారద)



ప్రచురణకర్త :

"సాహితీవర్ధన" ఉండపల్లి సీతారామస్వామి

(సాహితీ నికుంజం వ్యవస్థాపకాధ్యక్షులు)

.... ఇందులో ....

సర్వ శ్రీ....

సాహితీ సద్భావులు.


| | పుట |
|---|---|
| బి. వి. రాధారమణగుప్త | |
| శాంతిశ్రీ బొత్సకవి | 1 |
| బోసాన శేషగిరిరావు | 2 |
| ఉండపల్లి సీతారామస్వామి | 3 |
| శృంగార కవి రాధాకృష్ణ | 8 |
| దిట్టకవి శ్యామలాదేవి | 9 |
| మణిమెల నాగేశ్వరావు | 16 |
| గిద్దలూరు చెంచుబసవరాజు | 17 |
| శ్రీసుధ | 19 |
| జి. కృష్ణవేణి | 24 |
| తూములూరి నారాయణదాసు | 25 |
| బెహ్వారి శ్రీనివాసమూర్తి | 27 |
| కోడూరి శ్రీరాములు | 29 |
| డాక్టర్ మల్లిబాబు | 30 |


.మాన్య మనస్కుల రచనలు కలవు.





"Prajakavi"

# YOGI VEMANA

## Kavitha Prashasthi

Compilation of
First Edition
of his Birth Day
KARTHEEKA PURNIMA
(Dt. 11-11-1981)

Edited by
'Prajakavi'
Doctor: Malli Babu
Narsapur.


Published by
**SAHITHI NIKUNJAM**
NARSAPUR-534 275
W. G. Dist. [A. P.]





Printed at :
Sri Kanaka Durga
Printing Press, Narsapur.


Thank you

# ప్రజాకవి యోగి వేమన కవితా ప్రశస్తి

(సంపాదకీయం)

"ప్రజాకవి" యోగి వేమన కవితా ప్రశస్తి సమస్త మానవ సహృదయాలచేత వందలాది వత్సరాలుగా ప్రస్తుతు లందుకుంటూనే ఉంది. అక్షర లాభాన్ని అందనివారూ, వేమన పద్యం విననివారూ, వానలో తడవనివారూ ఆంధ్రావనిలో ఉండరు. ఆంగ్లేయుడైన బ్రౌన్ దొరవంటి అన్యదేశీయులనే ఆకర్షించి, విశ్వమానవతావాదిగా విఖ్యాతినార్జించింది వేమన్న నిశిష్టవిస్పష్ట రచన.

ఎందుకో! మా ఉండపల్లిలో ప్రవేశించింది. వేమన జయంతి చేయాలనే తలపు. తలపు నిలుపుకొనే తత్వంగల ఆయన మా సంస్థ సభ్యులతో అన్నారు. ఎవరు కాదనగలరు? ప్రజాకవి కెవరితర్లు? సంవత్సరం నుండి సాగించిన మా సమిష్టి యత్నం యీనాటికీవిధంగా సాధించగలిగాము.

మా "పిలుపు" అందుకొని రచనలంపిన వారందరికీ వందనాలు. మా ఉమ్మడి ఆశయాన్ని మూకుమ్మడిగా సాధించడానికి సాయపడిన అందరికీ అభివందనాలు. అడగంగానే అంగీకరించి సభకు విచ్చేసి జయప్రదం గావించిన సహృదయులకు కృతజ్ఞతానమస్సులు. సభా వేదిక సమకూర్చిన తిరుమలతిరుపతి దేవస్థానం కళ్యాణ మంటపం నిర్వాహకులకు ధన్యవాదాలు.

ఈ సంకలనం సకాలంలో ముద్రించిన శ్రీ కనకదుర్గా ప్రింటింగ్ ప్రెస్‌వారికి, కరపత్రాలచ్చువేసినవారికి, "బేనర్లు" వ్రాసియిచ్చిన వారికి ఈ సందర్భంలో సహకరించిన కార్మికులందరికీ అభినందనలు.

కడకొకమాట; సమయం చాలనందున సంక్షిప్త రీతిలో సంకలనం ముద్రింపవలసివచ్చింది. అందువలన కొందరిని నిరాశపరచక తప్పలేదు. మరు వత్సరమామాట రానీక, సమిష్టి కృషితో సర్వాంగ సుందరంగా, వినూత్న ప్రతిభా పాటవాలతో వేమన కవితా ప్రశస్తిని ప్రచురించాలని ప్రార్థనా పూర్వకాశంసన.

కత్తిమీద సాములాంటి సంపాదక సమస్యవల్ల సంకలన రచనలలో చేసిన చిరుమార్పులు, చేర్పులు సహృదయంతో స్వీకరింప వేడికోలు.

విరా— డాక్టర్ : మల్లిబాబు
సంపాదకుడు _ ప్రధాన కార్యదర్శి.

(స్థాపితం 19

# నరసాపురం సాహితీ నికుంజం

## కార్యనిర్వాహక వర్గము

గౌరవాధ్యక్షులు:- శ్రీ బొండాడ వెంకట రాధారమణ గుప్త
("వాణిజ్యవాణి" సంపాదకులు)

సాహితీ నికుంజం వ్యవస్థాపకాధ్యక్షులు:- శ్రీ ఉండపల్లి సీతారామస్వామి

గౌరవ ఉపాధ్యక్షులు:- పరమాత్మ శ్రీ నీలం వెంకటేశ్వర్లు. B. Sc.
(అగ్రికల్చరల్ ఆఫీసరు)

ఉపాధ్యక్షులు:- శ్రీ గంధం ఆదినారాయణమూర్తి (సినీ ఆర్టిస్టు)

గౌరవ కార్యదర్శి:- శ్రీ జి వి. కె. రామారావు. M. A. B. L.

సాహితీ నికుంజం వ్యవస్థాపక ప్రధాన కార్యదర్శి:- డాక్టర్ : మల్లిబాబు

కార్యదర్శి:- శృంగారకవి రాధాకృష్ణ (కవి నికేతన్)

సహాయ కార్యదర్శి- శ్రీ బి. థియడోర్. M. A.

కోశాధికారి:- శ్రీ తమ్మిశెట్టి హరనాధ్ (శక్రటరీ: చాంబర్ ఆఫ్ కామర్స్)

సభ్యులు:- సర్వశ్రీ వంగూరి సుబ్బారావు ("వసుంధర" సంపాదకులు)

.. కుమారి జి. కృష్ణణి
.. బళ్ళ నరసింహారావు
.. సాయిశ్రీ రేడియో ఆర్టిస్టు
.. ఆశపు గంగరాజు ("ఉండీల్" సంపాదకులు)
.. యాకూబ్ అలీ. (ఉదయశ్రీ కళాపరిషత్)
.. పొన్నాల వెంకటేశ్వరావు (రేడియో ఆర్టిస్టు)
.. టి. యూసఫ్. B. A. B. Ed.
.. ఎమ్. ఎన్. ప్రభాకరరావు. M. A.
.. చక్రావధానుల రెడ్డప్పధవేజి
.. లక్కోజు సత్యనారాయణమూర్తి
.. పి. ఎవ్. త్రినాధ్

ఆంధ్రప్రదేశ్ రజతోత్సవ శుభసమయంలో....

సాహితీ మిత్రులకు, యోగి వేమన అభిమానులకు, సహృదయులకు

# ఆహ్వానము!

విశ్వవిఖ్యాత సూక్తుల సుధారస ధారల ప్రపంచ మానవాళి

నిత్యజీవన వన హృదయ కుసుమముల ఆనంద రసపూరిత మొనరించిన,

"ప్రజాకవి"

# యోగి వేమన జయంతి

ది 11-11-1981 కార్తీక పూర్ణిమ బుధవారం సా॥ 5 గం॥లకు

నరసాపురం తిరుమల తిరుపతి దేవస్థానంవారి కళ్యాణ మంటపంలో

ప్రథమ జయంత్యుత్సవ సభానిర్వహణ

సాహితీ నికుంజము – నరసాపురం

—/ కార్యక్రమం /—

అధ్యక్షులు:– శ్రీ D.V.R.S.G. దత్తాత్రేయులు, M. A. B. L.

(సబార్డినేట్ జడ్జి–నరసాపురం)

సభాప్రారంభకులు:– శ్రీ గుడివాడ వేంకటేశ్వరరావు, B. Com. L. L. B.

(అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసరు, నరసాపురం)

జ్యోతి వెలిగింపు:– "కళాబంధు" శ్రీ బొండాడ వెంకటరాజుగుప్త (పాలకొల్లు)

పరిచయాలు:– శ్రీ G. V. K. రామారావు, M. A. B. L.

(సాహితీ నికుంజం గౌరవ అధ్యక్షులు, పాలకొల్లు)

"ప్రజాకవి యోగి వేమన కవితా ప్రశస్తి"–సంకలన గ్రంథావిష్కరణ:–

"కళాప్రియ" శ్రీ బొండాడ వెంకట రాధారమణ గుప్త

(సాహితీ నికుంజం గౌరవ అధ్యక్షులు, పాలకొల్లు)

కవిసమ్మేళనం ప్రారంభకులు:– "సాహితీ వర్ధన" శ్రీ ఉండపల్లి సీతారామస్వామి

నిర్వహణ:– "ప్రజాకవి" డాక్టర్ : మల్లిబాబు (ఎడిటర్: తెల్లజెండా)

– ప్రధానోపన్యాసకులు –

శ్రీ K. V. రమణారెడ్డి, (కావలి కాలేజీ లెక్చరర్)

శ్రీ పార్లపల్లి లక్ష్మీనరసారెడ్డి, (గుడివాడ)

శ్రీ బూసా చిన్నవీరయ్య, (భారతీ సమితి అధ్యక్షులు, గుడివాడ)

నెక్కంటి మాధవరావు, M. A. B. L.

# విజయ కిరీటము

"గానకవితా విశారద"

శాంతిశ్రీ: బొత్సకవి, రాజమండ్రి

అర్ధవృష్టి నీటు - యలరిన భావమ్ము
చిత్తవృత్తి దోచు - చెల్వులలర!
గజ్జె గట్టి ప్రజల - గదలించు వేమన
కాట వెలది యయ్యె - నాట వెలది

తెలుగు భారతికి క్రొందళ్కులు చెల్వులు
నిలువెల్ల గీలించి నిలిచినాడు!
దుష్ట దురాచార దుందుడుకుల కాళ్ళు
రాచి, సత్యమ్మును తూచినాడు!

సంఘ దురుద్యోగ శక్తుల కెదురొడ్డి
మేరు ధీరతతోడ మెలగినాడు!
తను నమ్మినట్టి సత్యమ్మును వమ్ముగా
నట్టి ధైర్యమ్మున వరలినాడు!

యోగి సుకవీంద్ర వేమన యోగి మరల
అదిగో! పైనుండి మనకునభ్యుదయ సదయ
నాశిషమ్ముల నీయగా నరుగుదెంచు
జోతలందింపు డతనికి ప్రీతితోడ!

తననిశిత శాస్త్ర శస్త్రమునమహా పండి
తోద్దండ రిపులను దూల్చినాడు!
తనవిశ్వతోముఖ ఘన పరిశోధన
లక్ష్య లక్షణములు వ్రాసినాడు

సర

తనచూపు నిత్యనూతన విద్యతో తెల్గు
వెల్గులు గాయించి వెలసినాడు!
తన మార్గమఖిల జీవనమార్గ గామియై
కలుములు జిమ్మగా గ్రాలినాడు!

నాడు, యీనాడు, యేనాడు, యీడులేని
సర్వశక్తుల, సుక్తుల, శాంతి ధర్మ
కర్మలను జూపజాలిన నిర్మలుండు
యోగి వేమన "సుకవి" సద్యోగమలర!

సుమహిత కావ్యరాశుల వసు స్ఫురణైక విశాలభావ మం
దము పొదుగంగ నా సుకవితాధిపులన్ గురు గౌరవమ్మునన్
తమిని గ్రహించు నట్టిది గదా! "నరసాపుర-సాహితీ నికుం
జము" జయమంది సత్కవివచస్సుధలన్ ప్రియమంది వెల్గుతన్!

# నా వేమన

—శ్రీ సోపాన శేషగిరిరావు, గుడివాడ

పలుకులా? వేమనవి
పాములకు మంత్రాలు!

భావమా? అది గాండీవం!
మేనక పైన కినుక!

మాయ? పరశువేది!
మనసు? త్రికాలవాది!

# విజ్ఞాన ఖని - యోగి వేమన

విజ్ఞాన విషయ రహస్య సంకేతములు
తెలిసిన వారెందరో మహాను భావులు
వారందరికీ నాశతాధిక వందనములు.

మానవ మమతాను గతస్మృతులు కొన్ని అగమ్య గోచరములు. వేమశబ్దం చిరపరమార్థం. రామశబ్దానికున్న ప్రాముఖ్యత సంతరించుకొనుట వర్ణనాతీతము. వేమన కవితా విజ్ఞానము అఖిలాంధ్ర తేజోవిరాజితము. ప్రపంచ ప్రజాబాహుళ్యానికి మహోన్నత భావాలు స్ఫురింప జేయుట యెనలేని సౌభాగ్యం కల్గించారు. కులతత్వం పెత్తనాల కుటిలో సుఖంగా జీవించలేరు ప్రజలు. అర్థంలేనికృతకమైన మత ఛాందసములో మనలేరు జనం. కనలేరు నిజం. కులమత సంస్కార విజయ సౌధసోపానముల పైనెక్కి జయఘంటలు మ్రోగించిన ధన్యుడు వేమన యోగి. ఎవరో కొందరు చేవలేని మాటలు భవిష్యత్ సూక్తులు చాలా చెప్పారు. వట్టిమాటలెక్కడా చెప్పలేదు వేమన. వందలాది ఏండ్లనుండి రోజు రోజుకి వారి మాటలు చేవలుదేరి పదునెక్కుచున్నవి.

రాళ్లనమ్మియున్న రాజాధిరాజులు
కూటి కెడలి భువిని కూలిరనిరి;
రాళ్ల పగులఁగొట్టి రాక్షస పుత్రులు
మాళ్లు నూళ్లు గలిగి మనిరి వేమ;
కోతిబట్టి తెచ్చి కొత్తపుట్టముగట్టి
కొండముచ్చులెల్ల గొలిచినట్లు ॥వి॥

అని పూసగుచ్చినట్లు చెప్పారు. కులాన్ని మతాన్ని దేవుణ్ణికూడా విమర్శించిన వేమన్న కవితా వాస్తవము కుటిలదారుల కాళ్లూ చేతులూ కదలనీయదు.

రాళ్ళు దేవులైన రాసులు మ్రింగవా ॥వి॥

అని వాదించిన మహాకవి, ప్రజాకవి. పుక్కిటి పురాణాలు లెక్కచేయక నిజాన్ని తన ఘంటముతో పలికించి కులికించిన గొప్ప గుణశాలి వేమన.

గాడిద మెయి పైన గంధంబు బూసిన
ఏమొఎరుగలేక ఎగసిదన్ను

అంటారు వేమన్నగారు దేశాలను కొల్లగొట్టుచే రాచరికాలకు మూలం. ప్రజల్ని పీడించి ఆడించడమే వాళ్ళకు వెన్నతోబెట్టినవిద్య యుగయుగాలుగా రాజుల కున్న అహం విపరీతం, చెలిమి పరిమితం.

గూండాలు మా గురువులు
రౌడీలు మా సైన్యాలు
బోకర్లు మా బంధువులు
దేశాలు మా స్వంతాలు
భూములు మా కమతాలు

అంటూ బూకరిస్తారు భుజకీర్తులుగల రాజులు, తరాజులు, వారి తాబేదారులు, సంఘ విద్రోహులు, స్వార్థపరులు ఒకరేమిటి దుర్మార్గులందరినీ జంకూగొంకూ లేకుండా విమర్శించారు వేమన.

కులబలాల ఆరాటం
సభ్యతపై పోరాటం స్వార్థపరుల బులబాటం
జాతికి చెరగని మచ్చ
నీతికి ఎదురైన కక్ష!

మతమౌఢ్యంపై చురక వేసిన వేమన దీక్ష మానవతకు తగిన రక్ష. కుక్కలు చింపిన విస్తరి చేసిన కులవ్యవస్థపై నిర్భయంగా పోరాడిన యోధుడు వేమన. ఆనాటి రాజుల్ని, కపటవేషధారుల్ని, అధికార మదాంధుల్ని, మాయామంత్రి తంత్ర మతావేశ పరుల్ని హడలగొట్టిన మొహమోటమిలేని మహాకవితగూర్చిన ధన్యుడు వేమన! చెడు స్నేహితులగురించి చెప్పినమాటలు అమూల్యములు బాగుచేయువారు తక్కువ చెడగొట్టువారు ఎక్కువ. ఈనాటికి మరీ తేటతెల్ల మయ్యింది. వారు చెప్పిన సూక్తి!

కొనివానితోడ గలసివర్తించెనా
హానివచ్చు నెంత వానికైన
తాటికింద పాలు తాగిన చందమౌ ॥వి॥

టక్కరులనుగూడి యెక్క సక్కెములాడ
నిక్కమైన ఘనుని నిరుకు చెడును
ఉల్లితోటబెరుగు మల్లెమొక్క కరణి ॥వి॥

ఉప్పు కప్పురంబు నొక్కపోలికనుండు.
చూడ చూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా ॥వి॥

వినేవారికి వీనులవిందుగా ఆలోచించేవారికి, అర్థయుతంగా ఎంతో సునిశిత భావముతో మలిచిన కవితాకల్పన మానవజాతికి చెరగని చరిత్ర కల్పించెను. సమాజం బాగోగులకొరకు కృషిచేసి వారి శక్తిని ప్రతిఫలింపజేసి జాతికి వెలుగును ప్రసాదించిన మనోజ్ఞ మందారముగ, కలువలు పూచిన సుందర సరోవరంగా తులతూగించాలన్నారు దేశాన్ని. వేమనకు సాటిరాగల కవులు చాలా అరుదు. చల్లని పిల్లవాయువులు వీచిన చందం వేమన కవిత ముక్కుకు సూటిగా చెప్పే మూడు ముక్కలు హృదయానికి హత్తుకునే శక్తి వేమన కవితలోగల ప్రావీణ్యత, అద్భుతం అజరామరం. హోరుగాలివంటి వాగాడంబరం వారి కవితలో కలికానికైనా కానరాదు. అగ్గిపుల్ల, కుక్కపిల్ల, సబ్బుబిళ్ళ, కావ్యలక్షణాలే అంటాడు శ్రీ శ్రీ. వేమన ప్రతి అక్షరాక్షరం కావ్యలక్షణంగా మలిచారని చెప్పాలి. అలలు అలలుగా ఆర్ద్రంగా సాగింది వేమన కవితావైజయంతి. ఆటవెలదులు తేట గీతులతో నడిచిన కవిత, అందరకూ అర్థమయ్యే భాష, సుకుమారమైన భావం స్ఫురిస్తుంది. హృదయం స్పందిస్తుంది,

తిరుమలకు బోవ – తురకదాసరిగాడు॥
శివుని ప్రతిమజేసి చీకటింటబెట్టి
మ్రొక్కవలదు వెర్రి మూఢులార!

అని సంబోధించారు వేమన. నిష్కళంకమైన కాపుకులం వాడని వ్యవసాయం వృత్తిగా గలవాడని చెప్పియున్నారు వంగూరి సుబ్బారావుగారు తన గ్రంథావలోకనమందు కాపుకులంగురించి వేమన చెప్పిన సూక్తులు వినసొంపుగా ఉంటాయి.

కవియుగమునసున్న కాపుకులానకు
వేమన తనకీర్తి వికశ్రియించె॥
ఉన్న ధర్మమెల్ల నుర్విలో పరులకు
గొల్లబెట్టి బరముగోరె వేమ॥
కాపుకులజులెంత కర్ములైయుండిన
పాపరాసి కొంతపరిసిపోవు.
వివరమెరుగనట్టి వెర్రిజీవులుగాన ॥వి॥

వేమన గురువుగారు లంభిసీయోగి. దిగంబర వేషధారి. జైనమత ప్రకాండుడు, దిగంబరత్వం అనుసరించాడు. అందుమూలముగా దిగంబరిగా తిరిగాడట వేమనగారు. వారిని గురించి అన్నీ విచిత్రాలే!

తల్లిగర్భమందుదయ మందిన యపుడు
మొదలుబట్టలేదు తుదను లేదు
నడుమ బట్టగట్ట నగుబాటుకాదుకో ॥వి॥

వేమన గురించి ఎందరో మహామేధావులు వ్రాశారు. ఎవరేమి వ్రాసినా అదే సమగ్రమైన గ్రంథమని ఒక్కరూ నొక్కి చెప్పుకోలేదు. ఆద్యంతాలులేని ప్రకృతిలో యిరుక్కుపోయిన వేమన కవితా ఘనత వారి జీవిత చరిత్ర సమాజంపై చెరగని ముద్ర వేసింది. తరుగెరుగని కవితామృతం బుసలుబుసలుగా పొంగిపొరలే పాలసముద్రంలో వారు ప్రసాదించిందే సూక్తుల సుధాభాండం, అంధుల అదృష్టపు కలశం, పూజార్హమైన పూర్ణకుంభం. ప్రపంచ పరివ్యాప్తంగా వేమన కవితా ప్రశస్తిని కీర్తించిన మహానుభావులు సి. పి. బ్రౌను, కాంప్‌బెల్, బార్నెట్, మెగ్గొనాల్డు, గ్రోవర్ మొదలైన విదేశస్థులు కొన్ని సంవత్సరాలనుండి వేమన పద్యాలు సూక్తులుగా మలుచుకొని చెప్పుకుంటున్నారు వేమన చెప్పినట్లు!....

మనియుండెడి జనమెల్లను
చనిపోయినవారి దివ్యసత్కథలెల్లన్
వినవలె గనవలె మనవలె
అని మిషులకునైన దెలియదంత్యము వేమా!

వేమనగారి జన్మస్థానం గురించి ఎన్నో సమస్యలు ఎదురైనవిగాని యీమధ్య ఒకరి పరిశోధన ఫలితంగా వారినిలయం తేటతెల్లమయ్యింది. పునిచెర్ల స్టేషను దిగువున పీలేరు స్టేషను దిగువున పాకాలధర్మవరం రైలుమార్గంలో మూగ చింతపల్లి గలదని సోదాహరణంగా చెప్పబడింది. ఈ అన్వేషకుడు "ఈనాడు" లేఖల్లో వ్రాశాడు. అన్ని రసాలు యిమిడ్చి అక్రిమాల నివారణకు కృషి జేసిన మొనగాడు వేమన. దోపిడి మూకల మాట మూటలు విప్పి నిజమనే నిప్పులో బూడెదపాలుజేసిన వేమన ధన్యుడు.

వారు ఎచ్చోట సిద్ధిబొందిరో యింతవరకూ పరిశోధన జరగలేదనే చెప్పాలి. మన మహాకవులు నర్సాపురం వాస్తవ్యులు శ్రీయుతులు వంగూరి సుబ్బారావుగారు వేమన చరిత్రి వ్రాసియున్నారు వారు కవితా విమర్శలో విషయ సేకరణలో అందెవేసిన చెయ్యి. కార్తీక పౌర్ణమి వారి జయంతిగా నిర్ధారణ చేశారు. నేనది శిరసా వహించాను. మరియు అనేక గ్రంథములు రచించిన విమర్శకాగ్రేసర శివశ్రీ బండారు తమ్మయ్యగారు వేమన చరిత్రి ప్రథమ ముద్రణ 1970 లో విడుదల చేశారు. లోగడ మదరాసు విశ్వవిద్యాలయోపాధ్యక్షులు సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి ప్రోత్సాహంతో శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి ఉపన్యాసములు ఆంధ్ర విశ్వ విద్యాలయంవారు ప్రత్యేక గ్రంథముగా ప్రకటించి ఇంటర్మీడియట్ పరీక్షకు పాఠ్యముగా నిర్ణయించినారు.

ఉస్మానియా యూనివర్శిటీ లెక్చరర్ గోపీ అనే యువకుడు వేమనపై డాక్టరేటు డిగ్రి సంపాదించాడు. గాని అదికూడా సమగ్రమైన గ్రంథమని చెప్పుకోలేదు. ఎందరో మహనీయులు వారిపై గ్రంథాలు వ్రాశారు.

ఆనాడు గోదావరీ మండలంలో పర్యటించినట్లు చెప్తారు. స్వర్గానికి సిమెంటురోడ్డు వేస్తానని చెప్పలేదు. వేమన మానవులకు జ్ఞానోదయం జాతికి ఉషోదయం చేకూర్చిన గొప్ప దేశభక్తుడు. ప్రజాకవి యోగి వేమన వారికి వారే సాటి. వారి జయంతి జరపాలనే సంకల్పం యీనాటికి నెరవేర్చుకుంటున్నాను. పరలోకములోనున్న వేమనగారికి ప్రణామములు సమర్పించుకుంటున్నాను.

జైహింద్

11-11-81 "సాహితీవర్ధన" ఉండపల్లి సీతారామస్వామి

నరసాపురం వ్యవస్థాపకాధ్యక్షులు "సాహితీ నికుంజం"

# ప్రజా కవీంద్రుడు వేమన

-శృంగారకవి రాధాకృష్ణ
కవినికేతన్_నరసాపురం.

మానవసంఘ దోషముల మాన్పగబూనిన జ్ఞానయోగి దా
వానలమట్లు యర్థమిడు వాగ్వినియోగ విశారదుండు - ఏ
వానకు నెండకైన తనవాదన వీడని ధీయుతుండు భా
వానల రాశి వేమనకు వాణియెజేసె ప్రజాకవీంద్రునిన్.

తేలికమాటలన్ గవిత తేరిన సీరమువోలెవ్రాసి ఏ
కాలపులోకులైన తమ కాలమె వేమనదంచు బల్కవే
వేలుగగీత కందములు వేరగు జాతులనెన్నొ గూర్చి భూ
పాలుర లెక్కసేయకయె భాసిలె వేమన భాగ్యశాలియై.

లోకపు పోకడల్ మనసులోపలనాటెడు మంచిమాటలన్
పాకముజేసి పెట్టెనిట. పానముసేయగ నాటవెల్దితో
మాకవి వేమనార్యుడ సమానుడు వాఙ్మయవార్థిలోన భూ
లోకపు వాసులన్ దనిపి లోపములన్ దెగటార్చె బంధువై.

భాషలరాజులౌ గవులు భాసిలియుండిరి యొక్కబాటనే
వేషమదేమిలేని మనవేమన వెళ్లెను వేయిరీతులన్
శేషములేక సంగతుల సేకరణంబొనరించినట్టియా
భాషలౌశ్లేష భావములు భాసిలునంబర చుంబితంబులై.

వేమ జయంతి సేయుటకు వేసె. పునాదిట ఉండపల్లి ఆ
వేమన భాష్యముల్ వినగ వేచియునుండిరి సాహితీ ప్రియుల్
కామిత కావ్యఖండికల కల్పనజేసిన వాగ్విభూషి మా
వేమన కన్నమిన్నలిల వేరొకరెవ్వరు లేరు లేరికన్.

* శుభం భవతు *

# మన వేమన

—శ్రీమతి దిట్టకవి. శ్యామలాదేవి M. A.

ఆంధ్ర భాషలోని నుడికారపు సొంపును హస్తగతం చేసికొని అతి చాకచక్యంగా పద్యాలను కూర్చి. ఆ కవితలతో, సూక్తిపుష్పావళి నల్లి ఆంధ్ర భారతి కంఠాన్నలంకరించిన ధన్యుడు వేమన. వేమనది సూక్తిముక్తావళికాదు సూక్తిపుష్పావళి. ముక్తావళి సామాన్యులకందుబాటులో వుండదు, పుష్పావళి సర్వజనులకూ సులభంగా లభ్యమయ్యేది. ఈ పుష్పాలు వాడేవికావు. దేవ పారిజాతాలు కవిహృదయ పారిజాతాలు. వేమన పద్యాలన్నీ శతకంగానే సాధారణంగా చెలామణి అవుతున్నాయి కాని వేమన పద్యాలు వందకు పరిమితం కాలేదు. ఒక్క మకుటం విషయంలోనే అతని పద్యాలు శతకమనిపిస్తాయి. కాని వేమన పనికట్టుకుని వంద పద్యములు రచించాలని గాని, ఒక వెయ్యి రచించాలని గాని లక్ష్యంతో పద్యరచన చెయ్యలేదు. మనసు చలించినప్పుడొక పద్యం, ఆత్మ ఆక్రోశించినప్పుడొక పద్యం, గుండె గుబగుబలాడినప్పుడొక పద్యం హృదయం వ్యధచెందినప్పుడొక పద్యం ఇలా రాసుకుంటూపోయాడు. అందుచేతనే వేమన పద్యాల్లో సందర్భశుద్ధి, చిత్తశుద్ధి, సత్యాన్వేషణ, ఆత్మాశ్రయత్వం తేట తెల్లంగా కన్పిస్తూంటాయి. కఠిన పదాడంబరత్వముగాని, అలంకార శృంఖలత్వంగాని వేమన పద్యాలలో కనుపించవు. తాను హృదయ పూర్వకంగా భావించి, నమ్మిన సత్యాన్నే అలతి పదములలో, ఆట వెలదులలో, అలవోకగా ఆటలాడుచున్నట్లే చెప్పినాడు. వేమన పద్యం చదువుతుంటే అన్వయం చూసుకోనక్కరలేదు. నిఘంటువు అవసరంలేదు. అమ్మో పద్యం! అనిపించదు. ఆత్మీయుడైన మిత్రుడు హాస్యంగా మందలిస్తూ విమర్శిస్తున్నట్లే వుంటుంది. జడ మతికైనా రెండు మూడు సార్లు చదివితే జీవితాంతం హృదయంలోనే వుంటుంది. చెప్పేవిషయం ఎంతటి బ్రహ్మాండమైనదైనా (బ్రహ్మ స్వరూపం) చెప్పడంలో ఒక సున్నితత్వం. సునిశితత్వం. నిర్భయత్వం, నిష్కర్షత్వం వెల్లడిచెయ్యడంలో వేమనకి అందె వేసిన చెయ్యి.

వేమన ఏకాలానికి చెందినవాడు? ఏప్రాంతానికి చెందినవాడు అన్న విషయం సంశయాస్పదంగానే వున్నది. వేమనని వెలుగులోనికి తీసుకువచ్చిన

సి. పి. బ్రౌన్ వేమన 18వ శతాబ్దం వాడని ప్రథమ ముద్రణలో 17వ శతాబ్దం వాడని ద్వితీయ ముద్రణలో ఇంకా నాల్గువందల యేళ్ళనాటి వాడని మూడవ ముద్రణలోని పీఠికలో పేర్కొన్నాడు. రాజకీయ సాంఘిక పరిస్థితులను పద్యాలలో అక్కడక్కడా వెల్లడి అయినదాన్నిబట్టి కాలనిర్ణయం చేయవచ్చును. కాని వేమనవని చెప్పబడి ముద్రణాభాగ్యం పొందిన పద్యాలన్నీ వేమనవే ననడం సాహసమే అవుతుంది. ఉత్సాహము అభిరుచి కల్గి పద్యము రాయకల్గిన ఏ కవి యైనా వేమన ననుకరించి ఉండవచ్చును. ఇందుచేత గూడా వేమన కాలనిర్ణయము కఠినము గావచ్చును అయినను యేకాలపు వాడు యే ప్రాంతపు వాడు అన్న ప పండితులను పరిశోధకులను శిఖపటు పట్టిస్తోంది గాని, రస స్వీకారమునకు విషయ స్వీకారమునకు ఆప్రశ్న అప్రస్తుతము. అనవసరము. చదివిన ప్రతివానికి వేమన మనవాడు అనిపిస్తుంది. అలా అనిపింప చేయ గల్గించే వేమన పద్యమని పోల్చుకోవచ్చును. ప్రత్యేకంగా నీతిబోధ చెయ్య డానికన్నట్లుగ రచించినపద్యం వేమనది కాదుఅని ఘంటాపథంగా చెప్పవచ్చు. "వేమన యోగి వెలసె లోకములోన పూజలిడుడు పుణ్యపురుషులార" ఇది బ్రౌన్ సంకలనంలో మొదటిపద్యం. ఇది వేమనపద్యం అయివుండదని నా అభిప్రాయం వేమనలో పరులనుండి పూజలందు కోవాలనే ఆశ లేదు. పూజచేస్తే పుణ్యం వస్తుందనే భావం వేమనకు లేదు. (భక్తిలేనిపూజ పత్రిచేటన్నభావం వేమనది) అహం లేదు. వేమనయందుగల భక్తిచేత అతని శిష్యులెవరో యీ పద్యాన్ని రచించియుండవచ్చు. వేమన మనస్సు క్రమ పరిణామ దశలో వికసితసుమమై శివపాదముల కర్పితమైనదిగాని సద్యోజాతునివలె "యోగియై వెలసె" ననుట నిజముకాదు. వేమనను గూర్చి మరియొక భేదాభిప్రాయము కలదు. అది, వేమన సాధారణ శైవుడా, వీరశైవుడా. ద్వైతియా? అద్వైతియా. శుద్ధాద్వై తియా? అని. ఈ మీమాంస కూడా వృధాప్రయాస, కంఠశోష అనియే చెప్ప వచ్చును. ఏమిచెప్పాడన్నది ప్రస్తుతముగాని, ఎవరు చెప్పారన్నది కాదు కదా? చెప్పినవారిని గౌరవించుట మన విధికదా అందురేమో? వేమన యని గౌరవింప వలెను. అట్లుగాక శైవుడన్నచో శివమతాభిమానులే అభిమానించుటయు, అద్వైతియనగా మరల అద్వైత మతానుయాయులే గౌరవించుటయు జరుగవ చ్చును. అట్లు కాక వేమన మనవాడు అనుకొనినచో అందరి పూజలు అతనికే

వశమగును. నిజమునకు వేమన అన్ని మతములకు సంబంధించినవాడు. విశ్వ మతస్థుడు. విశ్వమానవశ్రేయస్సును కోరిన విశాల హృదయుడు. మకుటం లోనే ఆయన మతం వెల్లడౌతోంది. ఏ కోదండరాముడో, సీతామనోభిరాముడో కాక విశ్వదాభిరాముడినే ఎన్నుకున్నాడు. వేమన విశ్వమెరిగిన వాడు. చీమ దగ్గరనుండి సింగపుపిల్ల స్వభావముదాకా తెల్సినవాడు. వలసినంత తత్త్వజ్ఞానము సర్వమత సారమును ఎఱిగిన వేమనను విశ్వకవి యనవలెను గాని శివకవి యనుట సరికాదు.

అన్నిమతముల నాదరించిన "శివ" అన్నపదము ఎక్కువమార్లుప గించెను గాన శైవమందే ఆతనికి అభిమానము మెండని వాదింతురు. శివ పదము నూటికి ఎనభై పద్యములలో ఉపయోగించెననుట సత్యము. కాని "రామ" పదము నూటికి నూరు పద్యములందునా ఉపయోగించెను. ఆ రాముడు విశ్వదాభిరాముడు. కొందరు అభిరామయ్య అను పేరుతో ఒక వ్యక్తిని సృష్టించి అతనియందు కృతజ్ఞతతో ప్రతి పద్యమున అతనిని స్మరించెనందురు. అభిరామ అన్న పదమునకు అందమైన అను అర్థముకూడ కలదు. వేమన చెప్పిన నీతులు అన్నీ ఎవరికో చెప్పుకోలేదు. తనకు తానే చెప్పుకొన్నాడు. అందుచేతనే "వినుర వేమ" ఓ వేమా! విను! అని. మూర్ఖంగా ఏ ఒక్క మతాన్నీ కొండెక్కించలేదు. తప్పు కన్పించినచోటల్లా విమర్శించటానికి వెరవ లేదు. విమర్శలో స్వ-పర భేదం చూపలేదు.

వేమన పద్యములు అతని మానసిక వికాసాన్ని ఒక క్రమంలో వెల్లడిస్తున్నట్లుంటాయి. ఇందుకు అనువుగా కొన్ని భాగాలుగా పద్యాలని విడ దీయవచ్చు. ఏ వ్యక్తి అయినా అతిడెట్టి మహామనీషి అయినా పరబ్రహ్మ స్వరూపాన్ని ఒక్క మాటుగా కనలేడు ఆ పరమసోపానాన్ని ఒక్కొక్కమెట్టే ఎక్కి గమ్యాన్ని చేరుకోవాలి. వేమన పద్యాలనే క్రమంగా విడదీయవచ్చును. 1) ధర్మము 2) సత్యము 3) శౌచము 4) కులము 5) మతము 6) కర్మము 7) కర్తృత్వము 8) బ్రహ్మజ్ఞానము 9) ఏకేశ్వరోపాసన.

మానవుడు శీలసంపన్నుడై దయా సత్య శౌచాది గుణములు కల్గి నప్పుడే నిజమైన భక్తిమార్గము నందాతని మనస్సు పోసురకలు వేస్తుంది - అంతేగాని వృథా పూజలు ఫలరహితములని వేమన శతథా బోధించాడు. తోటి

మానవుని ఆకలిని గాని దీనతనుగాని కనలేని మనిషి తన అంతరాంతరాలలో నిక్షిప్తమైన ఈశ్వరునేమి కనగలడు? బ్రహ్మపథమెట్లు చేరగలడు?

దానము, ధర్మము శీలము :

దిక్కులేని వారి దీనత బాపిన
పురుషుడిహము నందె పూజ్యుడగును
పరము నందు భాగ్య మేమనవచ్చును
విశ్వదాభిరామ వినురవేమ!

ఈ ప్రకారంగానే దిక్కులేని రోగికి ఆలనా పాలనా కూడా చూడాలని వేమన ఉద్బోధించాడు – "అన్నిదానములకన్న అన్నదానము" మేలన్నాడు.

ధర్మమరసి పూని ధర్మరాజాదులు
నిర్మలంపు ప్రాప్తి నిలుపుకొనిరి
ధర్మమే నృపులకు తారక యోగంబు ॥వి॥

ఇలా ఇల్లాలి ధర్మము ఇల్లాలికి, గృహస్థు ధర్మము గృహస్థుకే చెప్పాడు.

ఇంటియాలు విడిచి యిల జారకాంతల
వెంటదిరుగు వాడు వెఱ్ఱివాడు
పంటచేను విడిచి పరిగె యేరినయట్లు ॥వి॥

చేనిలో ధాన్యపురాశి వదలుకుని రాలినగింజలకై కక్కుర్తి పడినట్టే జారకాంతల వెంట పడడం అన్నాడు వేమన ధర్మాచరణలో దాన, శీలములు ప్రముఖ పాత్ర వహించును.

సత్యము :– సత్యము యొక్క ప్రాముఖ్యమును అంతా ఇంతా అనరాదు, అనృత మాడకయుండుట సత్యమునుపాసించుట సత్యస్వరూపుని తెలుసుకొనుట సత్యము జ్ఞానము విడదీయరానట్టివి.

సత్యమమరి యుండ, జ్ఞాన మమరియుండు
జ్ఞాన మమరియుండ సత్యముండు
జ్ఞాన సత్యములిల సమమైన – ద్విజుడగు. ॥వి॥

సత్యమున్న జ్ఞానముంటుంది.
జ్ఞానమున్న సత్యముంటుంది
జ్ఞానము + సత్యము ఉంటే మనిషి ద్విజుడౌతాడు.

ద్విజుడనగా బ్రహ్మజ్ఞాని.

నిజములాడు నతడు నిర్మలుడై యుంటు
నిజములాడు నతడు నీవి పరుడు
నిజము పల్కకున్న నీచజన్ముడె యగు ॥వి॥

సత్యోపాసన చేసినవాడు ద్విజుడౌతాడు. అట్లాగే నిజము పల్కకున్న నీచ జన్ముడెయగు. అచట ద్విజుడనగానే బ్రాహ్మణుడెట్లుకాడో ఇచట కూడా ద్విజుడనగానే కడజాతి వాడని అర్థము కాదు. నీచమానవుడనియే అర్థము. అలాగే సత్యవాక్కు వలన, ఘనత, ఐశ్వర్యము, మోక్షము కల్గునని వేమన ప్రవచించినాడు.

శౌచము (శుద్ధి)

ఆత్మ శుద్ధిగా లేకుంటే ఆచారమెందుకు?
భాండం శుద్ధిగాలేకున్న పిండివంటలెందుకు?
చిత్తం శుద్ధిగాలేకున్న సహస్రనామాది పూజలెందుకు?

నీటిని శుభ్రిపరచేందుకు చిల్లగింజ (ఇండుప గింజ) ఉపయోగం ఎంతో వుంటుంది. అట్లాగే ఈ మనస్సును మురికినుండి వేరుచేసి స్వచ్ఛంగా చేయుటకు ఉపయోగపడేవాడు గురువు.

గురువు చిల్లగింజ కుంభమీ దేహము
ఆత్మ కలుష పంక మడుగు బట్ట
తెలిసి విరిచెనేని దివ్యామృతము తేరు ॥వి॥

అన్నమునకు అంటుయైన నాత్మకు అంటు
యాత్మను పెనుగొన్న అన్నమంటు

మలిన వస్త్రముతో మాసిన తలతో జిడ్డు శరీరముతో వచ్చిన అగ్రజన్ముడైనా పొమ్మంటారు, అని చెప్పాడు వేమన. శౌచము, శుద్ధి అంతఃకరణకెట్లు ముఖ్యములో బాహ్యమునకు కూడ ముఖ్యములే నన్నాడు.

కులము, మతము:-

శైవులు కులమునకు ప్రాధాన్యమీయరు.

వేమన కూడా కులమునకు కాక గుణమునకు ప్రాధాన్యమిచ్చెను అని కొందరి యభిప్రాయము. వేమన మానవతావాది. అన్ని కులములలోని నైచ్యాన్ని తెగనాడాడు. మాల కులస్థులను దూరంగా వుంచడం సహింపలేక....

"మాలవానినేల మరి మరి నిందింప
నొడల రక్తమాంస మొకటి గాదె" అన్నాడు.

ఇంతకూ అతనిలో వున్నవాడు మాలవాడేనా? అన్ని ప్రశ్నించాడు. "రామనామ పఠనచే వాల్మీకి....బాపడయ్యె కులము ఘనముకాదు గుణము ఘనంబురా" ఏమతములో దోషము కన్పించినా విమర్శించాడు. శైవులనూ వైష్ణవులనూ ఒకే త్రాసులో తూచాడు. అసలు మతభేదాలెందుకు అన్ని మతములు ఒక్కటే కాదా "విష్ణుభక్తులెల్ల వెలిబూది పాలైరి
వాదమేల మత విభేద మేల
తెలియ లింగధరులు తిరుమంటి పాలైరి" అన్నాడు శివకేశవులకు భేదంలేదని తెలుపుతూ "విష్ణువరయ తల్లి వెలయ రుద్రుడె తండ్రి-" వాళ్ళిద్దరూ తల్లిదండ్రులు తల్లి గొప్పదా తండ్రి గొప్పదా అని మరో వాదన లేవనెత్తకుందురుగాక!

లింగధారులందు దొంగలు కలరయా....అన్నట్లే

"ఎంబెరు మతమందు నెసగ మాంసము దిని
మారుపేరు పెట్టి మధువు త్రాగి" మతం పేరిట
జనులు ఎంత నికృష్టులుగ, పశుతుల్యులుగ మారిపోతున్నారా అని వ్యధచెందాడు. రెండు మతముల వారూ ఒకరినొకరు తిట్టుకుంటూ తమలో తాము కుమ్ముకుంటూ ఉంటే పిట్టపోరూ పిట్టపోరూ పిల్లి తీర్చినట్లు అసలుకు మోసం రావడం మూఢ మతోన్మాదులు గ్రహించలేదే అని వాపోయాడు. "ఒకరి నొకరు నిందనొనర జేసి, తురక జాతి చేత ధూళియై పోదురు" ఇచట ఒకరి నొకరు నిందచేసుకునే వారు లింగమతస్థులే కానక్కరలేదు. పైనుండి వచ్చువాడు తురకవాడూ కానక్కరలేదు సర్వేసర్వత్రా ఐకమత్యం లేనందువలన నష్టపోయేది మీరే అని నష్టపోయేవారికి హితోపదేశం జేశాడు. సకల మతములు వేదకు (వెలుగు) తేజంబొకండె కాని సాటివాని మతాన్ని సహించని మతం ఏం మతం? "షణ్మతములకు దేవుడొక్కడని తెలియ లేరా?"

తన మతము వదలక
తుది నెవ్వరి మతములైన దూషింపకయున్
పదిలుడయి కోర్కె గోరక
ముదమున చరియించువాడె మాన్యుడు వేమా॥

స్వధర్మే నిధనం శ్రేయః అన్న ఆర్యోక్తి ఎంతో లలితంగా చెప్పాడు వేమన.

కర్మము కర్తృత్వము :

జనులు ఏం చెయ్యాలని తలచినా అది చెయ్యలేరు. కర్మమూ దైవమూ కలసి రాకపోతే ఒక పని జరిగిందంటే తమ గొప్పతనాన్ని చాటుకుని చెడు జరిగితే విధిని తిడతారు.

"చేటు వచ్చెనేని చెడనాడు దైవమ్ము
మేలు వచ్చెనేని మెచ్చుదనను
చేటుమేళ్ళు దలపచేసిన కర్మముల్"

రెండూ పురాకృత కర్మముల వల్లనే జరుగును. ప్రారబ్ధమును ఆప ఎవరికీ శక్యముకాదు. మంచి తిథీ, వారం, నక్షత్రం చూసి ముహూర్తం పెట్టి పెండ్లి చేస్తే వధూవరులిద్దరూ యమపురికేగారుట. ఇలాగే శకునములను కూడా నమ్మ రాదన్నాడు

"మంచి శకునములని యెంచి పెండిలి యాడ
వారలొకరు లేరు వసుధ లోన
జనుల కర్మములను శకునముల్ నిల్పునా" ॥వి॥

మూఢ నమ్మకములకు వ్యతిరేకి –

బ్రహ్మజ్ఞానము, ఏకేశ్వరోపాసన:

బ్రహ్మజ్ఞానము నొందుట ఏకేశ్వరోపాసనము, ఈ రెండును విత్తు ముందా చెట్టు ముందా అన్న మీ మాంస వలె వుంటుంది. ప్రణవంలో ఈశ్వర దర్శన మందగల్గిన యోగికి బ్రహ్మజ్ఞానము కల్గుటయు పరబ్రహ్మ స్వరూప మును 'లోకన్ను" (కన్ను) తో చూడగల్గిన వ్యక్తికి ఈశ్వర సందర్శనమును ఏక కాలముసే జరుగును.

బ్రహ్మ యెక్కడున్నాడని వెఱ్ఱిజనులు వెతుకుతూ వుంటారు కాని "బ్రహ్మ మన్నిటియందు పరిపూర్ణమై యుండు" నన్నాడు. ఈ బ్రహ్మమును గురువే చూపింపగల్గుతాడు. ఆ బ్రహ్మానందమున "విశ్వమంతయు తానగుతాను విశ్వంబైన తత్త్వమగును." ఇట్టి సత్యమును చెప్పగల్గిన వేమన యోగి, ఋషి బ్రహ్మర్షి. "ప్రణవ మెరుగనోడు – భక్తుడెప్పుడు గాడు, జ్యోతి ఎరుగనోడు– యోగి గాడు."

బ్రహ్మ మనగ వేరె పరదేశమున లేదు
బ్రహ్మ మనగ తానె బట్టబయలు
తన్ను దానెరిగిన తానె పో బ్రహ్మంబు ॥వి॥

"సొమ్ము దొరుకు దనుక జ్యోతి యంతియె కాక
సొమ్ము దొరుకు వెనుక జ్యోతి యేల
దేవుడైన వెనుక దేహంబు యది యేల ॥వి॥

తానే దైవమైన మన వేమన నిర్మల యోగి

ఉపయుక్త గ్రంథములు

వేమన పద్యాలు:- బంగోరె సంపాదకత్వంలో వెలువడినది.
వేమన చరిత్ర — శివశ్రీ బండారు తమ్మయ్య

# వేగుచుక్క

—శ్రీ మణిమెల నాగేశ్వరావు, గుడివాడ.

తెలుగుకేడిక – వెలుగు వేమన
ఆటవెలదికి – పాటనేర్పిన
మాటమాటొక – ఈటెపదును...
జాగుచేసుక – వేగుచుక్కకు
ఊరు, పేరు, దారి – ఏదని వాదమా?
వేదమూర్తుల – వేట తెలిసి నవ్విపోడా!....
ఎసరుపెట్టే – ముసురు టీగల
కసిమసంగి – విసరె వేమన....
ఇప్పుడు రమ్మను విశ్వదాభిని
జైలుయన్నది – వేచియున్నది....
గాంధి చంపిన – దేశమే యిది
ప్రజలు యేలే – రాజ్యమేమరి!....

# విశ్వదాభిరామ వేమసుకవి!

"భాషాప్రవీణ," శ్రీ గిద్దలూరు చెంచుబసవరాజు M.A.,
రేపల్లె

ఆటవెలఁదిభావ మరసి మాటాడిన
మేటి, కైతలోనఁ దేటతెనుఁగు
పాటపాడి తేనె వాకలు పాఱించు
విశ్వదాభిరామ వేమసుకవి!

జంకుగొంకులేక సాంఘికలోపముల్
చాటి చెప్పు హాస్యరసగుణుఁడు
పరవిమర్శగాదు స్వవిమర్శయు నొనర్చు
విశ్వదాభిరామ వేమసుకవి!

కామియయ్యు మోక్షకామి యయినవాఁడు
భోగియయ్యు యోగిపుంగవుండు
నవ్వుకొనెడి వాఁడు నవ్వించువాఁడును
విశ్వదాభిరామ వేమసుకవి!

భక్తిగలుగువాఁడు శక్తి గలుగువాఁడు
మోసమెందునున్న రోస మూని
త్రోసివేసి వెలుఁగుఁ ద్రోవను జూపించు
విశ్వదాభిరామ వేమసుకవి!

"బ్రౌను"నుతులు గొన్న ప్రౌఢుండు చతురుండు
వేషధారణమున వెఱ్ఱివాఁడు
లౌకికుండు పారలౌకికజ్ఞానిరా!
విశ్వదాభిరామ వేమసుకవి!

వైష్ణవుండు గాఁడు పరమశైవుఁడు గాఁడు
వేదవాది వేదవేత్త గాఁడు
సకలతత్త్వ విదుఁడు జ్ఞానస్వరూపుండు
విశ్వదాభిరామ వేమసుకవి!

వేదసార మెఱిఁగి భేదభావ మడంచి
తత్త్వసుధను గ్రోలు తాత్త్వికుండు
మాట వాఁడి గులుకు. మనసు సుధల నొల్కు
విశ్వదాభిరామ వేమసుకవి!

మాట మాట కొక్క మంచి యుపమ సెప్పు
నద్దమందు బింబ మలరునట్లు
అతిశయోక్తు లింత యల్లంగఁ బోవండు
విశ్వదాభిరామ వేమసుకవి!

రసము లెన్నఁ బోఁడు రసికుల మెప్పొందు
ప్రౌఢబంధపదము పలుకఁబోఁడు
వాఁడినుడుల భావబంధకవిత గూర్చు
విశ్వదాభిరామ వేమసుకవి!

భక్తవరుఁడు యోగివరుఁడు జ్ఞానివరుండు
సూక్తివేత్తృవరుఁడు సుకవివరుఁడు
వేదువుసారమెఱుఁగు సంస్కారి యుపకారి
విశ్వదాభిరామ వేమసుకవి!

కామిగానివాఁడు కవిగాడు రవిగాడు
కామి గాక మోక్షకామిగాడు
కామియైనవాడు కవియౌను రవియౌను
విశ్వదాభిరామ వినురవేమ.

'ప్రజాకవి' వేమన

# వేమన కవితా ప్రశస్తి

"శ్రీసుధ" మంగళగిరి.

వేమన పదిహేనవ శతాబ్దమువాడని ఇంచుమించుగా తెలుస్తూంది. వేమన ఉనికి కదిరి తాలూకా నల్లచెరువు కటారుపల్లె. వేమనను కొందరు జంగాలలో చేర్చుకున్నా తానేకులప్రసక్తి చెప్పుకున్నాడు కనుక కాపు అని తేల్చబడింది.

ఒరులకొరకు భూమి నొదిగించు వారలు
నవనిపతికి వశ్యులైన వారు
పాలవంటి కులము వారు "కాపు" లెఱుంగు    వి॥

జాతిభేదముల ఖండించిన మొదటి ఆంధ్రుడు వేమన. మానవతను, మమతను, మనస్సులనుండి వెలికి తీసి యెలుగెత్తి చాటాడు తన చాటువుల్లో. నీతి తక్క జాతిగాదు ఖ్యాతి అని ఖండించాడు. గౌరవమునకు ముఖ్యకారణం ఎరుక. "ఎరుకలేనివారలే జాతియైననేమి" అంటాడు.

"ఉయ్ వాంట్ అడ్రిస్ - నాట్‌డ్రిస్" అని, ఓ ఇంగ్లీషు సామెత ఉంది. మానవతను మనిషిని గుర్తించాలి. గాని జాతిని మతాన్నిగాదు అని సత్యం చాటిచెప్పాడు. నిజానిజాలు తెలుసుకోడానికి దేశం అంతా తిరిగాడు. మునుల్ని, ఋషుల్ని పరామర్శించాడు. అనాచార బ్రాహ్మణ్యాన్ని విమర్శించాడు. వేదాల సారమంతా తర్కించాడు. గ్రంధస్త వేదం ఎంత గొప్పదైనా సత్యంలో సారంలేనిది సనేమిరా పనికిరాదన్నాడు.

ఈ సత్యాన్వేషణలోనే తెగిన గాలిపటంలా దేశమంతా తిరిగి తిరిగి తన వేదాంతాన్ని చిరస్థాయిగా నిలిచే కవితలో సామాన్య మానవునికిగూడా అందుబాటులో అర్థమయ్యే రీతిలో చాటువులతో ఆట వెలది నేలమీద నాలుగు పాదాల నాట్యంచేశాడు. శ్రీనాథునికి సీసము, తిక్కనకు కందము, వేమనకు ఆట వెలది వెన్నతోపెట్టినవిద్య. యతిస్థానం అతి కుదురుగ జతపడుతుంది. వేమనకు ఆట వెలది నడక ప్రకృతి దత్తప్రసాదమనవచ్చును.

"పనసతొనలకన్న పంచదారకన్న
జుంటితేనె కన్న జున్ను కన్న
చెరకు రసముకన్న చెలిమాట తీపురా!"

ఈలాగా "వ్రాల కందని పద్యముల్ వేలసంఖ్య" అని తనే వ్రాసుకున్నాడు. ఇప్పటికి మూడువేల పద్యములు అందుబాటులోకలవని కవులెందరో అన్నారు. వేమన రాజపోషణక్రింద తపించలేదు కనుక అంగడికవికాదు. వేమన నూతనాధ్యాయమును సృష్టించి అభిరుచిన కల్పించడమేగాని మున్నున్న దానికే చిలవలు పలవలు కల్పించి పాలు పల్చనచేయలేదు. స్వల్పపుమాటల్లో అనల్పమైన భావాన్ని అందించాడు.

"తిరుపతికినిబోవ తురకదాసరికాడు
కాశికేగ పంది గజముగాదు
కుక్క సింహమగునె గోదావరినిదూక"

వేషధారణలోగూడా క్రీస్తు, గాంధీ ప్రభృతులకంటే అతి స్వల్పవస్త్రాన్నేవాడి నిరూపించుకున్నాడు.

"నడుమ బట్టకట్ట నగుబాటుకాదకో" అని

స్నానసంధ్యాదులందు కూడా విరక్తిజెంది ముక్తికై ప్రాకులాడిన వ్యక్తి వేమన. దీనికి తార్కాణం,

"మలము మూత్ర రక్తమాంసయుక్తంబైన
మట్టుకుండనీళ్ళ ముంపనేల
పైమురికియెగాని లోమురికి బోదురా" వి॥

పద్యంచాలు. జీవితమంతా తరచితరచి ఒక నిర్ణయానికి వచ్చాడు. జీవితం కరి చాలంటే రెండువిద్యలు కావాలన్నాడు. మిగిలిన కోటి విద్యలు మూఢ [illegible]క్రింద నెట్టివేశాడు.

"ఇహమున సుఖియింప హేమతారకవిద్య
పరమున సుఖియింప బ్రహ్మవిద్య
కడమవిద్యలెల్ల కల్ల మూఢుల విద్య".

వేమన కవితలో శబ్దశుద్ధి, ఛందోనియమము అంత ముఖ్య స్థానము వహించలేదని ఆధునికులగోల ఉన్నప్పటికి కలికి వలసిన మృదుమనోభావములు, దయదాక్షిణ్యము, సానుభూతి, శోకము, భక్తి, వాత్సల్యము పరిణయము గోచరిస్తున్నవి కనుక వేమన కవితకు దానోహం అన్నారు.

వేమన కవిత బహుగుణ సంపన్నతతో ముత్యాల్లాంటి పదాలను పది మందికి పంచి యిచ్చింది. తనలో స్వేచ్ఛాగుణంతో అలరారే 1. నవ్యత. 2 పరిపూర్ణ ఆంధ్రభాషా శోభితం. 3. కొంచెంలో ఘనత వహించే మాటల పొందిక. 4. చక్కటి సమయస్ఫూర్తి. 5. కవితలో విడరాని జతలతో లోకోక్తులు. ఈ పంచామృతంతో కవితాకలశాన్ని నింపి ప్రపంచానికి పంచి యిచ్చిన మహాకవి వేమన.

శృంగారాన్ని ఎప్పుడెప్పుడెలాపొందాలో పొందాగా అందుకున్న రసికుడు వేమన

1. "అనగననగ రాగమతి రమ్యమైయుండు
పెనగ పెనగ సతికి ప్రేమ పుట్టు
తినగ తినగ వేము తియ్యనైయుండురా" వి॥

2. "కడుపునిండ తవుడు గంపలో పెట్టిక
చన్నుబట్టనీక తన్ను గేదె
వీరకాంతలెట్లు వలతురో యూరక వి॥

3. మొలక చనులనాడు మోహంబు బుట్టించు
గుబ్బచనులనాడు కోర్కె తీర్చు"

రసికుడు కనుకనే సంతానం సర్వదా ఇష్టం లేనట్లు కనబడుతుంది.

"సతుల గవయుటను సుతులబడసెదమని
వెతలబడుట యెంతో వెర్రితనము
నేలనున్న రాయి నెత్తికెత్తినట్లు వి॥

రసికుడైయుంటే కళాప్రియుడు కూడా కాక తప్పదు.

"విద్యల లోపల నీతియు
వాయిద్యంబులలోన వీణ వరరసికులకున్
హృద్యంబై విలసిల్లు
విద్యలలో బ్రహ్మవిద్యే విద్యర వేమా!"

వేమన కళాప్రియుడేకాదు భోజన ప్రియుడుకూడా.

"నేయిలేని కూడు నీయాన కసవది
కూరలేని తిండి కుక్క తిండి
ప్రియములేని కూడు పిండపుకూడురా." _అంటాడు.

అంతేకాదు మనసులేకుండా మనుగడ కు దరదుష్ణమైనా అంటాడు.

"దాతలేని కొంప దయ్యాల పెనువాడ"
నీతిలేని మాట రాతిపేట
ప్రీతిలేని లంజె ప్రేతవాహనమయా  వి॥

స్త్రీలవిషయంలో పతివ్రతా లక్షణాలు శాసించాడు.

"పతిని తిట్టరాదు పదివేలకైనను
పెట్టి చెప్పరాదు ప్రియముగాను
పతిని మీరరాదు సతిమానవతి"  వి॥

స్త్రీ మహాశక్తి అనిగూడా నిర్ధారించాడు.

"బోటి యొకతె బ్రహ్మనోటిమీదతన్నె
కొమ్మ యొకతె విష్ణురొమ్ము తన్నె
సఖియ యొకతె శివుని సగముగా జేసెను"  వి॥

వేమన కర్మసిద్ధాంతాన్ని కాదనలేదు. దైవాన్ని గుర్తెరగమని పదే పదే హెచ్చరిస్తూ ఉండేవాడు. భారతం మొత్తం తిరగవేసినట్లుగా తెలుస్తుంది.

1. "సాటివారు నిన్ను సాధింపగాలేరు
దైవమెప్పుడు నీకు తప్పకున్న
భారతంబులోని పరమార్థమిదెకదా!"  వి॥

2. "కానలేడు నుదురు, కర్ణముల్, వీపును,
నెఱులు గానలేడు నెత్తిమీద
తన్నెకానలేడు దైవమునెరుగునా"  వి॥

3. "ఎదుట కలిమిజూచి యేడ్చెడువారికి
భాగ్యమెటులగూర్చు బరము గురుడు
తన పూర్వకర్మ దైవమెఱుంగడా."  వి॥

పల్లిలాపాలాడు వారిని పశువులకంటె హీనంగా చూస్తాడు.

"బండబూతులాడు పరమ నీచుండెన్న
దండివారి మెల్మిదానెఱుగునె
చందనంబు ఘనత పంది యే మెరుగును"

వేమనకు వైద్యంగూడా తెలుసు. ఔషధుల పరిజ్ఞానం ఉంది.

"నోటిపుప్పికెల్ల నొప్పిలేకుండగా
నాకు పోక సున్న మౌషధముగ
బెట్టకుండెనేని బెనురోతవేయదా!"

ఈలా వేలకువేలు పద్యరత్నాలు ఇసుకపాతరలా వేమన నుడికారాలు చెప్పుకుంటూపోతే కోకొల్లలు. ఈలాటి సూక్తికవులు మరికొందరు లేకపోలేదు, భర్తృహరి సుభాషితాలు, పండితరాయ కవి సొంపులు, సుమతిశతకాలు ఉన్నాయి, ఐనప్పటికి వేమన పరభాషతో పనిలేక, పక్కింటితో పొత్తులేక తన కవితలో నవ్యతను నాణ్యతను ధారావాహికంగా ఆంధ్రభాషలో అమర్చాడు కనుక వేమన కవిత ఎవరి కవితకు పోలదు. ఇతరుల కవితలు వేమన కవితతో సరితూగలేవు. తన పద్యాలు, తన వ్యక్తిత్వం అజేయంగా నిలిచాయి. భాషకు విశేషంగా ప్రాణంపోసి అనర్గళంగా నడిపాడు. తన హృదయాంతరనాళాల్లోంచి పెల్లుబికిన అమృతవాహిని వేమన కవిత, దీనికి సాటిలేదిలః దానికదే వెలః.

వేమన కవితాశక్తిని పరిపూర్ణంగా చెప్పడానికి ఏఒక్కరికీ శక్యం కాదు, అందుకేనేమొ నరసాపురం సా హి తీ ని కు ం జ ం వా రు ముఖ్యంగా శ్రీ ఉండపల్లి సీతారామస్వామి, పరమాత్మ, డా॥ మల్లిబాబుగారలు సామూహికంగా నడుంకట్టి సాహిత్య రథాన్ని లాగాలని లాగించాలని కవికులానికి పిలుపునిచ్చారు. నా కుంచెనుగూడా ఆ రథానికి రంగులు వేయడానికి ఆయత్తంచేయగలందులకు ప్రోత్సాహమిచ్చిన సాహితీ నికుంజం కార్యకర్తలకు నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

॥ శుభం ॥

# మానవ మతవాది

-కుమారి జి. కృష్ణవేణి. (Ist B. A.) నరసాపురం

పుణ్యమూర్తి! ఓ వేమన్నా!
ధన్యజీవివి నీవన్నా!
నీవు చెప్పిన నీతి సూత్రములు
వేవిధాలుగా ప్రీతి పాత్రములు పు॥

చిన్ని చిన్ని నీపద్యమ్ములలో
ఎన్ని ఎన్ని నగ్నసత్యమ్ములో
మానవాళికవి అందించితివి
మరపురాని మహానీయుడవైతివి పు॥

తేట తేనియల తెలుగుభాషలో
మేటి కవితను తీర్చిదిద్ది
సాటిలేని ఘనసేవ యొనర్చిన
తెలుగుల వెలుగువి పెద్దన్నా! పు॥

కులమతాల కతీతుడవైతివి
దురాచారముల దుయ్యబట్టితివి!
సంఘసంస్కరణోద్దేశ్యంతో
నాటి కాలమందె నడుం కట్టితివి! పు॥

యజ్ఞయాగముల క్రూరత్వమును
సంప్రదాయముల నిరంకుశత్వము
తోటి మానవుని ద్రోహచేతత్వము
సముచితముగ ఎదిరించితివయ్యా! పు॥

వర్ణభేదములు వలదని చెప్పి
దళిత మానవుల పీడనవిప్పి
మానవత్వమును మతముగ చాటి
తాడిత జనతకు దేవము వైతివి! పు॥

# వేమన కవీ!

– శ్రీ తూములూరి నారాయణదాసు, M. A. పెదనందిపాడు

దివికింజూచి నిమీలితాక్షుడయి ఆర్ద్రీభూత చేతస్కుడై
సువిశాలంబుగ దృక్కులంబరపి సంశోధించుచున్ లోకమున్
పువుదేనెల్ గురియించు మాటలకు సొంపుల్గూర్చి దూషించు వా
డెవరయ్యా! తరుమూలమందు దిగినాడే! యోగియా? భోగియా?

అతడే వేమనయోగి ప్రాయమున వేశ్యాలోలుడై చిక్కి. యు
న్నతి సౌఖ్యాంబుధి లోతులంగని. తుదిన్ నైరాశ్యముంబొంది. యీ
గతి సర్వమ్మునురోసి. ముక్తిపథమున్ గాంక్షించె బైరాగియై
నతు లందిమ్ము వినమ్రమూర్తివయి ఆంధ్రా! నీదుపెద్దన్నకున్.

అన్నా! వేమన! నీకు జోడయిన సంఘాచార సంస్కర్తయే
ఉన్నాడా? మతవర్ణభేదంబులు దైవోక్తంబు గాదంచు నీ
వెన్నో యేండ్లకు ముందె చెప్పితివి గానీ. లోకమాలించెనా!
విన్నాణంబుగ వర్ణధర్మమహిమల్ విన్పించు నీనాటికిన్.

వెలయాలి నిండు కౌగిళులందు నిదురించి
కొరత లేకుండ మేల్కాంటివీవు
భాగ్యభోగాల గర్భమునందు జన్మించి
గోచిపాతను దెచ్చుకొంటివీవు
చదువు సంధ్యలమాట చవిచూడ కున్నను
వేదసారము పంచిపెట్టితీవు
గుడి గోపురముల గారడినెల్ల శోధించి
ఋజుమార్గములను బోధించితీవు
మతము చాటున పెద్దలు సతతమాడు
నాటకములెల్ల కవితలో చాటితీవు
వేమన కవీంద్ర! జోతలర్పించుకొందు
అందుకొనుమయ్య! ఏలోకమందుగలవొ!

ఆచారములకంటె ఆత్మశుద్ధియె ముఖ్య
మఖిల మానవ జాతు లరయ నొకటె
మంత్రనీరముకంటె మంగలిజలమెచ్చు
కాశికేగుట డబ్బు ఖర్చు కొరకె
తలబోడిదైనను తలపు బోడిదిగాదు
వేదవిద్యల కాత్మవిద్య రాదు
మంత్ర తంత్రాలకు మహిమలే దిసుమంత
పాతపురాణాలు బూతు కథలు

కానుకలిచ్చి పూజగావించి దేవుని
మోసగింప మనకె మోసమగును
తెలిసి. దెలుపుడంచు తీయకైతను జెప్పి
తెలుగు బాస పరువు నిలిపినాడు.

## వినర! వేమ!

ఆట వెలదిగూడి – యాట వెలదిగూర్చి
అనుభవించినావు – అవనిగల్గు
సాటిలేని సుఖము – శాశ్వతంపుపేశము
విజయమందు నీదె – వినరవేమ!

– డాక్టర్: మల్లిబాబు

# ప్రజాప్రియ

— శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి, కుంటిమద్ది.

బిచ్చగాని తంబురా తంత్రి స్వరాల్లో
శృతిగలుపుకుని,
యావదాంధ్ర ప్రజల జిహ్వాగ్రాలపై
తాండవించే కవిత—
విదేశాల్లో విజ్ఞాన బీజాలు వెదజల్లిన కవిత—
సత్య శివసుందర సాహిత్యంలో
మకుటాయమానంగా ప్రవహించిన ప్రజాకవిత—
వేమన మహాకవిత!

పొంగారి హృదయంలో పైకుబికిన కవిత
గంగాధుని తరంగాలుగా పొరలిపోయే కవిత—
సాంఘిక లోపాలు సంస్కరిస్తూ
హాస్యరసాన్ని తొణికిస్తూ
అపూర్వ భావాలకు ఆలవాలంగా
అందరి సొమ్ముగా అలరించే నవకవిత
వేమన మహాకవి విశ్వకవిత—

గులకరాల గనిలో
వజ్రాలు సేకరించుకుని
అచ్చంగా స్వతంత్రంగా సాగిపోయిన కవిత—
శుష్కపండితుల నిరసనకు చోటీయక
పరిశుద్ధమైన ప్రజాహృదయాల్లో
తనకు తానుగా నిల్చిన కవిత—
రెడ్డిరాజుల కాలంలో
రేకులు విప్పుకుని
సౌగంధ్యం వ్యాపింప జేసిన కవిత—

పద్యానికి పద్యంగా
పాటకు పాటగా
పరవళ్ళు తొక్కుతూ
పరమార్థాన్ని బోధించే పవిత్రవాణిగా.
"ప్రజావీణ"గా
సమయ ప్రపంచంలో రాణకెక్కిన
వేమన మహాకవి కవిత-

పేదలు నివసించే కుటీరాల్లో
తొలికోడి కూతగా ప్రబోధగీతం పాడిన
కవితాయోగి తపశ్శక్తి ప్రభావంగా
ప్రభవించిన కవిత-
పామరుల కుపాధేయంగా
ప్రజారాజ్యాన్ని పాలించే వేమన మహాకవి కవిత.

అందరికీ ఆస్వాదయోగ్యం.
అందుకునే ప్రజల భాగ్యం.

## వినర! వేమ!

ఆట వెలదు లందు - నాట వెలదులందు
నీకు ఉన్న మమత - నీదుఘనత
కోటిమాటలేల? నేటికీ నను లేరు
విజయమందు నీదే! వినర వేమ!

— డాక్టర్: మల్లిబాబు

# వేమన కవీంద్రుఁడు

—"కవిరత్న" శ్రీ కోడూరి శ్రీరాములు, గుడివాడ

కం॥ ఆంధ్రత్వముట్టిపడగా
నాంధ్రావనిలో నివాసమాజన్మముగా
నాంధ్రకవిత్వముగొనెనహా!
ఆంధ్రుడు వేమన కవీంద్రుఁడార్యవరేణ్యా!

కం॥ సోదర భావము వెలయన్
వేదార్థరహస్యమెల్ల విదితముజేసెన్,
వాదములేలా? పండిత
యాదరణమ్మునకుఁ బాత్రుఁడయ్యెనతఁడిలన్॥

తే॥గీ॥ నిరతలోకోపకార తత్పరుఁడునౌచు,
నీతిదాయక కవితను నెగడినాఁడు
సర్వదేశసంబంధుఁడై సచ్చరితను
ప్రతిభగాంచెను వేమన వసుధయందు॥

తే॥గీ॥ భారతీవదనాబ్జ విభ్రాజమాన
కవిత కర్పూరతాంబూల గంధవాహ
బంధురమ్ములు వేమనపద్యరచన
నేలపై శాశ్వతమ్ముగ నిలిచియుండె॥

తే॥గీ॥ మూఢవిశ్వాసముల నొకమూలద్రోసి
ఆటవెలదుల శతకమ్మునందజేసి
చెప్పెనందెన్ని విధముల జెప్పవలయు
నన్నియునుదెల్పె. మెచ్చనత్యద్భుతముగ॥

# నిజమైన మనిషి - మనీషి వేమన

- "ప్రజాకవి" డాక్టర్: మల్లిబాబు నరసాపురం.

మనిషి మనీషిగా మారుటకు మార్గం మానవ మేధస్సు. మెదడుకు పదును పెడుతూ అనుక్షణం పరిసర పరిస్థితులను పరిశీలిస్తూ వాస్తవాలను అవగాహన చేసికుంటూ, సాటి సమాజంపైన సానుభూతితో జీవితాన్ని సాగించగలిగిన ప్రతి మనిషీ మనీషిగా మారగలడు. వేమన కాగలడు.

సామాన్య కర్షక కుటుంబంలో జన్మించి, వ్యవసాయ కార్మికుడిగా జీవించి, నిరుపేద సంసార భారాన్ని భరిస్తూ, స్వంత సమస్యలతోబాటు, సాటి సమాజ సమస్యలను గూడా తాత్విక దృష్టితో పరిశీలిస్తూ పరిష్కరింప బ్రయత్నించిన మనీషి వేమన.

వేదాంతం, రాజకీయం, శాస్త్రజ్ఞానం, కళలు, కవిత్వం వేరువేరు అనే వెర్రిబాగుల విధానాన్ని విడనాడి, సమస్తం మానవ కళ్యాణానికే వినియోగపడాలనే వివేకంతో అనేకత్వంలోగల ఏకత్వాన్ని కనుగొని విశ్వ మానవ సౌభాగ్యానికి సోపానాలు నిర్మించిన, నిజమైన మనీషి, వేదాంతి, రాజకీయవేత్త, సమాజ సంస్కర్త, శాస్త్రజ్ఞుడు, కవి, కళాకారుడు, భోగి, యోగి, త్యాగి, వేమన.

మనిషిని మరమ్మతు చేస్తాయనే వైదిక, బౌద్ధ, జైన, చార్వాక, సాంఖ్య, అచల, వీరశైవ, ద్వైతాద్వైత మతసిద్ధాంతాలలో లోతులు అవలోడనం చేసికొన్నట్లు వేమన రచనలు వివరిస్తున్నాయి. వేదాంతం శుష్కంగాను, మతం మత్తుగానూ, రాజకీయం కూహకంగానూ, కవిత్వం కాకాయిజంగానూ, కళ విలాసంగానూ, మనిషిని మాంద్యంలో పడవేస్తున్నాయనే వాస్తవాన్ని గ్రహించి, దాన్ని నిగ్రహించేందుకు శాయశక్తులా ప్రయోగాత్మకంగా సద్విమర్శకుడిగా కృషిచేసిన మనిషి వేమన.

తెలుగు పదాలతో వ్రాస్తే, తెలుగు ఛందస్సుతో వ్రాస్తే కవిత్వం కాదనే తెలుగుల పరభాషావ్యామోహాన్ని తిలకించి, అలతి లలిత పదాలకూర్పుతో, నేతులూరే గీతికలాంటి తెలుగు ఛందస్సులో ఎల్లమానవుల సంక్షేమాన్ని కోరుతూ ఎల్లలు దాటి వెళ్ళిన విశ్వమానవ కవిత్వాన్ని లిఖించిన ప్రజాకవి వేమన.

నరసాపురం వాస్తవ్యులు కీ॥ శే॥ వంగూరి సుబ్బారావుగారి పరిశోధనా ఫలితంగా వేమన జన్మదినం కార్తీక పూర్ణిమ. ఆనాడు నరసాపురం పట్టణ సాహిత్య సంస్థ సా[illegible]వారు వేమన జయంతి జరుపుట సహృదయా నందకరం.



* సర్వేజనాస్సుఖినోభవంతు. *